Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ జూన్ నెల 27 వ తేది శుక్రవారం [నెం. 15 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు:

### విమాన దాడులు.

ఈ వారము, బ్రిటిషు విమానదళము జర్మనీపైనను, జర్మను ఆక్రమిత ప్రాంతములపైనను ప్రచండమగు దాడుల సాగించి శత్రులకు అపారమగు నష్టమును కలిగించెను. 18 తేది బుధవారమునాటి రాత్రి జర్మను యుద్ధ నౌకలు దాగి యున్న బ్రెస్టు రేవుపైనను, బ్రిమెన్ రేవుపైనను వందలకొలది విమానములు అగ్ని వర్షము కురిపించెను. సాయంత్రము ఫ్రాన్సు ఉత్తరభాగమునను అనేక పారిశ్రామిక పట్టణముల పైనను దాడి జరిపెను. ఈ దాడులలో జెక్కు, పోలిషు, బెల్జియం వైమానికులుగూడ పాల్గొనిరి. ఈ దాడులలో చాల నష్టము కలిగించబడినటుల జర్మనులుగూడ అంగీకరించిరి. గురువారము రాత్రి లీహార్వె రేవుయందలి నౌకా నిర్మాణశాలలపై దాడి జరుపబడెను. కొన్ని బాంబులు అచటి నూనె గిడ్డంగులకు తగులుటచే లేచినమంటలు బ్రిటిషు తీరమునకు కనిపించెను. ఫ్రెంచితీరము సమీపముగా పోవుచున్న శత్రు సప్లై నౌక యొకటి ముంచివేయబడెను. ఇదిగాక కలోను, డస్సెల్డార్ఫు మొదలగు రూరు ప్రాంతమునందలి పట్టణములపైగూడ చాల అగ్ని బాంబులు వర్షించబడెను. 20 తేది శుక్రవారము రాత్రి జర్మను నౌకా నిర్మాణకేంద్రమగు కీలు రేవుపై భయంకరమగు విమానదాడి జరిగెను. ఇదిగాక, డంకర్కు బులోను రేవులపైనగూడ వందలకొలది బాంబులవేయబడెను. శనివారము పగలు ఫ్రెంచి కోస్తా రేవులపైనను ఫ్రాన్సు ఉత్తర భాగముపైనను దాడులు జరిగించిరి. ఈ దాడులలో 24 జర్మను విమానములకు తక్కువగాకుండ నిర్మూలించబడెను. మరల ఆదివారం పగలు బ్రిటిషు విమానాలు ఫ్రెంచి ఉత్తర భాగముపై దండెత్తిపోయినపుడు ఉభయపక్ష విమానములకును తీవ్రమగు పోరాటము జరిగెను. అందు 30 శత్రు విమానాలు పడగొట్టబడెను. నాడు ఫ్రాన్సు-జర్మనులపై బ్రిటిషు విమానములు సాగించిన దాడులు; శత్రులు లండనుపై నిదివరకు సాగించిన దాడులతో సమాన తీవ్రముగనుండెను. నాటి రాత్రి, జర్మను నౌకా నిర్మాణశాలలుగల విల్‌హెల్మ్సుషావెన్ పైనను డస్సెల్డార్ఫు మొదలగు పారిశ్రామిక పట్టణములపైననుగూడ చాల బాంబులు వర్షించబడెను.

మంగళవారము రాత్రి కొలోగుడ స్పెష్టార్ఫు మొదలగు జర్మను పారిశ్రామిక పట్నములపై తిరిగి కడు దీర్ఘమగు దాడి సాగింపబడెను. ఈ దాడులలో అపారమగు నష్టము కలిగినదని జర్మను అధికారులే తమ ప్రకటనలో అంగీకరించిరి.

బుధవారం మధ్యాహ్నం, బ్రిటిషు విమానములు జర్మనీ ఫ్రాన్సులో ఆక్రమిత ప్రాంతములపైనను ప్రచండమగు దాడిని సాగించెను. హజెబ్రూక్ స్టేషను (జర్మనీ) నందు మందుగుండు సామాను తీసుకొనిపోవుచున్న రైలు బ్రిటిషు బాంబులచే భయంకరమగు శబ్దముతో ప్రేలి ధ్వంసమై పోయెను. ఉదయము పరాసుకోస్తా రేవులపై వందలకొలది విమానములు దాడి సల్పి వేలకొలది బాంబుల వర్షించెను. కలేబులోను రేవులు పూర్తిగ ధ్వంస మొనర్పబడెను.

జూన్ 20 వ తేదితో ముగిసిన వారమున ఫ్రాన్సు ఉత్తర భాగముపై జరిగిన దాడులలో 49 బ్రిటిషు విమానములు నష్టమైనవి. ఆ ప్రాంతములలో జర్మనులవి 40 విమానములు శిథిలమైపోయెను. ఈ విమాన దాడులలో 11 వేల టన్నుల పరిమాణముగల శత్రు నౌకలు శిథిలమొనర్పబడెను. ఒక "ఈ" బోటు ముంచివేయబడెను.

జర్మను రాజధానియగు బెర్లినులో, బ్రిటిషు విమానదాడులవలన 50 కి ఒక్క భవనము చొప్పున పూర్తిగ శిథిలమై పోయెననియు, వీధులలో నచట నడచుటగూడ సాధ్యమగుటలేదనియు తటస్థ దేశీయులు దెలుపుచున్నారు.

బ్రిటనుపై శత్రు విమానముల దాడి ఈ వారము చాల స్వల్పముగ నుండెను. 18 వ తేది బుధవారము రాత్రి కొన్ని విమానాలు తీరముదాటి, తూర్పు ఆంగ్లియా జిల్లాపైకి వచ్చి అచ్చటచ్చట బాంబులు వేసెను. కాని నష్టము మాత్రమేమియు కలుగలేదు. గురువారము రాత్రిగూడ అక్కడక్కడ స్వల్పముగ బాంబులుపడెను. కొలది మందికి దెబ్బలు తగిలెను. ఒక శత్రు విమానము నేలకూల్చబడెను. ఇటీవలకంటె, శనివారము రాత్రి శత్రువులు దాడులను చురుకుచేసిరి. ఇంగ్లండు దక్షిణతీరపు పట్టణముపై తీవ్రమగు దాడియే జరిగెను. ఇంగ్లండు ఆగ్నేయనైరుతి ప్రాంతములందును స్కాట్లండునందునుగూడ చాల ప్రదేశములపై బాంబులుపడి కొంత నష్టము గల్గించెను. నాల్గు జర్మను విమానములీదాడిలో పడగొట్టబడెను. ఆదివారము రాత్రి లండనుపైకి (9 రోజుల తరువాత) కొన్ని శత్రు విమానములు వచ్చెనుగాని ఎక్కువ బాంబులు వేయలేదు. దక్షిణతీరమునందొక పట్నముపై కొలదిగ వేసినవిగాని నష్టమెక్కువ లేదు. సోమ, మంగళవారములలోగూడ శత్రుదాడుల్లు అత్యల్పముగనే యుండెను. మంగళవారం రాత్రి దాడిలో నాల్గు విమానములు పడగొట్టబడెను. జూన్ 21 వ తేదితో ముగిసిన వారమున బ్రిటనుపైనను, పరిసరములపైనను కలపి 17 జర్మను విమానములు పడగొట్టబడెను.

### ఆఫ్రికా మధ్య ధరా.

లిబియా సరిహద్దులలో ఆకస్మికముగ శత్రులపైబడి కాపుజో దుర్గమువరకును చొచ్చుకొనిపోయిన బ్రిటిషు సామ్రాజ్య సైన్యములు, మూడు దినముల పోరాటము జరిగినపిదప, యథాస్థానములకు 19 వ తేదిన తిరిగివచ్చి సురక్షితముగ చేరెను. ఈ పోరాటమున చాల నష్టముగలిగినదని జర్మనులును అంగీకరించిరి.

అబిసీనియాలో లెకిమ్టికి పడమట 15 మైళ్ల దూరములోనున్న దుర్గములను బ్రిటిషు సైన్యములు 19 వ తేది నాక్రమించెను. జిమ్మా దుర్గమును అబిసీనియా సైన్యములు 22 వ తేదిన ఆక్రమించెను. అచట 8,000 మంది ఇటాలి

యనులు ఖైదీలుగా పట్టుకొనబడిరి. ఇందు టిన్నీ సేనాని, ఇద్దరు డివిజను సేనాధిపతులు బ్రిగేడు సేనానులుగూడ గలరు. 24 వ తేదీన బ్రిటిషు అబిసీనియా సైన్యములు జిమ్మదాటి 60 మైళ్ల దూరముననున్న చెడెర్లీ అగారో కోటలను పట్టుకొనిరి. 400 సైనికులు ఖైదీలుగా పట్టుబడిరి. సుడాను రక్షణకు భారత సైన్యములు సల్పిన సహాయమునకు కృతజ్ఞతా సూచితముగ ప్రభుత్వము లక్ష పౌనులను భారత యుద్ధ నిధి కొసగిరి.

జూన్ 19 వ తేదితో ముగిసిన వారమున, మధ్య ప్రాత్యంలో మిత్రమండలి విమానములకంటె శత్రు విమానములు రెట్టింపువరకు ధ్వంసమయ్యెను. బ్రిటిషువారివి 37, శత్రులవి 60 విమానములు ధ్వంసమయ్యెను.

20 వ తేదీన జర్మను విమానములు, ఈజిప్టునందలి బ్రిటిషువారి అలెగ్జాండ్రియా నౌకాకేంద్రముపై రెండు దాడుల సాగించెను. ఆస్తికి కొంతనష్టము గల్గినది. 4 హతులైరి. మరికొందరకు దెబ్బలు తగిలెను. 23 వ తేదీన జర్మను విమానములు మరల పెద్ద దాడిచేసెను. 20 మంది ప్రజలు హతులైరి.

24 వ తేదీన మాల్టాపై దాడిలో ఒక శత్రు విమానము పడగొట్టబడెను.

## అమెరికా సంయుక్త రాష్ట్రాలు, అట్లాంటిక్.

అమెరికా సంయుక్త రాష్ట్రముల చర్యకు ప్రతీకారముగ జర్మనీ ప్రభుత్వము తమ దేశమునందును తమ ఆక్రమణ క్రింద నున్న ప్రాంతములలోను గల సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ కాన్సలేటులను మూసివేసి, కాన్సలులు జూలై 16 వ తేది లోగా వెళ్లి పోవలసినదని యుత్తరువు గావించిరి.

రూజ్వెల్టు అధ్యక్షుడు, 20 వ తేదీన కాంగ్రెసునకు సందేశమొసగుచు "రాబిన్ మూరు" నౌకాను ముంచినందుకు జర్మను చర్యను తీవ్రముగ ఖండించి, ఇందుకు జర్మనీ నష్టపరిహారము చెల్లింపవలెనని గోరెను. సముద్రములపై ప్రయాణమొనర్చుటకు అమెరికను నౌకలకుగల స్వాతంత్ర్యమును రెవరినీ అడ్డుపరపనీయమని ప్రకటించెను.

సంయుక్త రాష్ట్ర నూనె "రిఫైనరీ" యంత్రాలయములలో తయారగు మెలురకపు నూనెలలో సగభాగము బ్రిటనునకు ఎగుమతి చేయుచుండుటకు అధికారులు అనుమతించిరి. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమువారు రూజ్వెల్టు అధ్యక్షునకు "డాక్టరు" పట్టమొసగి సన్మానించిరి. పెట్రోలు సరకులను అధికారుల అనుమతిలేనిదే ఎగుమతి జేయరాదనియు, తూర్పుతీరపు రేవులనుండి బ్రిటను ఈజిప్టులకు అమెరికా దేశములకు దప్ప ఇతరుల కెవ్వరికిని ఎగుమతిచేయరాదనియు అమెరికా అధికారులు ఉత్తరువు గావించిరి.

సంయుక్త రాష్ట్రములు యుద్ధములో దిగునెడల ఫిలిప్పైను దీవులు పూర్తిగ సహాయమొనర్చునని ఫిలిప్పైను దీవుల గవర్నరు ప్రకటించెను.

ఇటలీ ప్రభుత్వముగూడ, తమ దేశమునందలి సంయుక్త రాష్ట్ర కాన్సలులందరు తమ కార్యాలయములను మూసివేసి వెడలిపోవలెనని యుత్తరువుల గావించెను. యునైటెడ్ స్టేటు ప్రభుత్వము దీనికి ప్రతీకారముగ తమ దేశమునగల ఇటాలియను కాన్సలేటులన్నిటిని జూలై 15 వ తేదీకి మూసివేయవలెనని ఉత్తరువు గావించెను.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వపు ఒ. 9 నెంబరుగల జలాంతర్గామి, 20 వ తేదీన సముద్రమున మునిగిపోయెనని ప్రకటింపబడెను.

జర్మనీ సోవియటు రష్యాపై దాడి సాగించెనను వార్త అమెరికాలో దిగ్భ్రమగల్గించినది. సోవియటులకు, సాధ్యమైన సహాయమంతయు చేయుదునని సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ అధ్యక్షుడగు రూజ్వెల్టు గారు ప్రకటించిరి.

అర్జెంటైనా శాసనసభవారు 20 వ తేదీన సమావేశమై తమదేశమున ఆక్సిసు కుట్రలగురించి విచారణచేయుట కొక ప్రత్యేక విచారణ సంఘమును నియమించుటకు ఉత్తరువు గావించిరి. ఈ సందర్భమున 450 నాజీ ఏజెన్సీ లచ్చటపని చేయుచున్నవని అర్జెంటైనా ప్రభుత్వ సైనికమంత్రి ప్రకటించెను.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ రాయబారియగు వినాంటుగారు 23 వ తేదీన లండనులో సోవియటు రాయబారిని కలసి సంప్రదించెను.

## ఇటలీ, గ్రీసు.

ఇటలీ ప్రభుత్వము 22 వ తేదీన సోవియటు రష్యాపై యుద్ధమును ప్రకటించెను.

ఇటలీగాను, టర్కీయును వచ్చేవారము చాల ముఖ్యమగు ఆర్థిక వాణిజ్య యొడంబడికను గావించుకొనునని వదంతిగ నున్నది.

ఇటాలియను లెవ్వరును సంయుక్త రాష్ట్ర సరిహద్దులను దాటిపోరాదని రూజ్వెల్టు అధ్యక్షుడు 20 వ తేదీన ఉత్తరువు గావించెను.

9,000 మంది బ్రిటిషు, ఆస్ట్రేలియా, న్యూజిల్యాండు సైనికులు గ్రీసుయుద్ధమున జర్మనీకి ఖైదీలుగ చిక్కిరని ఆస్ట్రేలియా మంత్రి ప్రకటించెను. గ్రీసు, క్రీటు పోరాటమునుండి 5,951 ఆస్ట్రేలియను సైనికులు తిరిగి రాలేదు.

## తటస్థ దేశములు.

జర్మనీ రష్యాపై దాడి సాగించినందుకు స్పెయిను అధికారులు తమ సంతృప్తిని వెల్లడించిరి.

పోర్చుగలు ప్రభుత్వము, అజోర్సు దీవుల రక్షణకొరకు మరికొంత సైన్యమును పంపెను. గాండా అను పోర్చుగీసు నౌక అట్లాంటికు సముద్రములో గుర్తు తెలియని జలాంతర్గామిచే ముంచివేయబడెను. ఆ ప్రాంతమున నెచటను బ్రిటిషు జలాంతర్గములు లేవని పోర్చుగలునందలి బ్రిటిషు రాయబారి ప్రకటించెను.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమువారు స్విట్జర్లండుకు స్వీడనుకు తమ దేశములో నిలువయున్న సొమ్మును ఇదివరకు బందుచేసిరి. ఇపుడు ఆ సొమ్మును తిరిగి విడుదల చేసిరి.

జపానుకు పెట్రోలు ఎగుమతి చేయరాదని అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము నిరోధించుటవలన, జపాను రెండు వారములలో చాల తీవ్రమగు చర్య దీసుకొనవలసి వచ్చుననియు, కాని, అమెరికాతో యుద్ధము జపానున కిష్టములేదనియు చైనా యుద్ధముతోనే జపాను అలసిపోవుచున్నదనియు, ప్రస్తుతం దక్షిణ అమెరికా రాష్ట్రములలో పర్యటన మొనర్చుచున్న జపాను మంత్రియగు యునుగటాగారు నుడివిరి.

నార్వేనుండి జర్మను సైన్యములను ఫిన్లాండునకు తమ దేశముగుండ పంపుటకు స్వీడను అనుమతి నొసగినది.

మే 31 వ తేదీన ఐర్లండులోని పట్టణములపై బాంబులు వేసినందులకు జర్మను ప్రభుత్వము ఐరిషు ప్రభుత్వమునకు హృదయపూర్వకమగు పశ్చాత్తాపమును దెలిపి జరిగిన నష్టమునకు పరిహారమొసగెదమని వాగ్దానమొనర్చిరి.

## నౌకా నష్టములు.

జూన్ 15 వ తేదీతో ముగిసిన వారమున బ్రిటిషు నౌకలు, విమానములు శత్రు నౌకలను 40 ప్రదేశములలో ఎదిర్చెను. 14 నౌకలు ముంచివేయబడెను. మరి 28 నౌకలు చాలవరకు శిథిలమై పోయెను. 17 వ తేదీన ఈజియన్ సముద్రమున "గూసెపినాగరాల్ది" అను ఇటాలియను నౌక ముంచివేయబడెను. ఇదిగాక మధ్యధరా సముద్రంలో 4,000 టన్నుల సప్లై నౌక యొకటి 2,500 టన్నుల నౌక మరియొకటి, 500 టన్నుల నౌకయొకటి ముంచివేయబడెను.

మే నెలయందు బ్రిటిషువారివి మిత్రమండలివి కలిసి మొత్తము 461,328 టన్నుల పరిమాణముగల 98 నౌకలు మునిగిపోయెనని బ్రిటిషు అధికారులు 20 వ తేదిన ప్రకటించిరి. ఇది మార్చి ఏప్రిల్ నెలలో కంటె చాలతక్కువ. దీనిలో 355,000 టన్నుల పరిమాణంగల 73 నౌకలు బ్రిటిషువారివి, మిత్రమండలివి 92 వేల టన్నుల పరిమాణంగల 20 నౌకలు. తటస్థ దేశాలవి 14,000 టన్నుల పరిమాణంగల 5 నౌకలు. మార్చి నెలలో 505,750 టన్నుల నౌకలు, ఏప్రిలు నెలలో 581,251 టన్నుల నౌకలు నష్టమైనవి. మే 10 నుండి జూన్ 10 వరకు 299,000 టన్నుల శత్రు నౌకలు ముంచివేయబడెను.

### టర్కీ-ఈరాక్-ఈరాన్-సిరియా.

టర్కీ-జర్మనీలు 18 వ తేదిన గావించుకొనిన ఒడంబడిక వలన—అంతవరకును ఆయుభయ ప్రభుత్వములకును ఇతరులతో వుండుకున్న ఒడంబడిక బాధ్యతలకు భంగము కలిగింపదనియు అందు ముఖ్యముగ ఆంగ్ల-తురుష్క సంబంధములు దీనివలన మారవనియు టర్కీ విదేశాంగమంత్రియగు సారాజోగులు 19 వ తేదిన ప్రకటించెను. ఆ యొడంబడికపై సంతకములు జరిగిన వెంటనే టర్కీయును జర్మనీయును పరస్పరము తమ ఆర్థిక వాణిజ్య సంబంధముల బలపరచుకొనుటకు నిశ్చయించెను. ఈ యొడంబడిక ముఖ్యముగ రష్యాకు ప్రతికూలముగ నుద్దేశింపబడెనని అమెరికను పత్రికలు వ్రాయుచున్నవి. విదేశీయ సైన్యములకు టర్కీగుండ రహదారీ యొసగుటకు టర్కీకి యెప్పుడును అంగీకరింపదని సారాజోగులు, బ్రిటిషు రాయబారియగు సర్. నాచ్‌బుల్ కిహ్యూజెసన్ గారికి నమ్మజెప్పెను. రష్యా-బ్రిటనులతోగల ఒడంబడికల కిది భంగకరముగానుండదనియు, సారాజోగులు వెల్లడించెను. టర్కీ శాసనసభవారు, కొన్ని ప్రాంతములలో సైనిక శాసనమును మరి మూడు నెలల కాలము అమలు జరుపుటకు ఉత్తరువు గావించిరి. ఐరోపాలో అక్సిసు రాజ్యములు నెలకొల్పదలచిన నూతన వ్యవస్థతో టర్కీకి ఎట్టి సంబంధమును లేదని యానిసభ పత్రికలో, యాల్సిన్ అను టర్కీ పత్రికా విలేఖరి వ్రాసెను.

టర్కీ శాసనసభవారు 22 వ తేదిన, ఇస్టాంబుల్‌నగర ప్రాంతమున "ఎమర్జెన్సీ"ని ప్రకటించి సైనిక శాసనము నమలు జరుపుటకు వుత్తరువు గావించిరి

ఈరాకునుండి, ట్రాన్సు జోర్డాన్ మీదుగా పాలస్థానమునకు మామూలు రహదారీ తిరిగి సాగుచున్నదని, రషీదు అలీ తిరుగబాటు సమయమున బస్రాలో నిలచిపోయిన సరకులు మరల రవాణ యగుచున్నవనియు 19 వ తేదిన స్వతంత్ర ఫ్రెంచి వార్తా సంఘము ప్రకటించెను.

రష్యా-జర్మనీ యుద్ధమునందు టర్కీ తటస్థముగనుండునని టర్కీ అధికారులు 23 వ తేదిన ప్రకటించిరి. జర్మనీకి-టర్కీకి వర్తకపు ఒడంబడిక సంభాషణలు కొలది రోజులలోనే ప్రారంభము కానున్నవని సారాజోగులుగారు ప్రకటించిరి. రష్యాయెడలను, అందు ముఖ్యముగ కాకసస్ ప్రాంతములగురించియు జర్మను వైఖరి యెటులుండునో తెలుపవలసినదని టర్కీ జర్మను ప్రభుత్వమును కోరెను.

సిరియాలో బ్రిటిషు సైన్యములు క్వినేట్రాకోటను 19 వ తేదిన తిరిగి ఆక్రమించెను. బ్రిటిషు సేనానియగు జెనరలు విల్సను,సిరియా రాజధానియగు డమాస్కసును తమకు స్వాధీనపరచి లొంగిపోవలసినదని విషీ సైన్యాధిపతియగు డెంట్జు సేనానికి సందేశమంపెను. అటుల లొంగనియెడల 20 వ తేదిన, డమాస్కసును చుట్టుముట్టియున్న బ్రిటిషు సైన్యము బలాత్కారముగ పట్టణమును ప్రవేశించునని హెచ్చరించెను. ఉభయ పక్షములకును తీవ్రమగు పోరాటము సాగుచుండెను. 21 వ తేదిన బ్రిటిషు స్వతంత్ర ఫ్రెంచిసైన్యము డమాస్కసు నగరమును ప్రవేశించెను. డెంట్జు సేనాని నగరమును ఖాళీచేసి తన సైన్యముల నుపసంహరించుకొనెను.

డమాస్కసు నగరంపట్టు పడిపోవుటతో, విషీ సైన్యముల ప్రతిఘటన యిక యెక్కువ రోజులు నిలువదనియు, డెంట్జు సేనానికి, వెనుక మూలబలంలేదనియు స్వతంత్ర ఫ్రెంచి నాయకుడగు డిగాలీ సేనాని 22 వ తేదిన ప్రకటించెను. 23 వ తేదిన బ్రిటిషు సైన్యములు పల్‌మైరా పట్టణమును సమీపించిరి. డమాస్కస్ సమీపముననున్న మెజీ విమానాశ్రయమును బ్రిటిషు సైన్యము లాక్రమించెను. బ్రిటిషు సైన్యములు మెర్జ అయూం పట్టణమును తిరిగి స్వాధీనపరచుకొనినవి.

### రష్యా-జర్మనీ యుద్ధం.

జర్మనీ మీద 22 వ తేదీ ఉదయం 3 గంటలకు దాడి వెడలినది. రష్యా యుద్ధం వివరాలు మొదటి రెండు రోజులవి వేరొక వ్యాసంలో గలవు. ఈ యుద్ధంలోకూడ ముందంజవేసి తామే గెలుస్తున్నట్లు ఉభయులు ప్రకటించుకొనుచున్నారు. మూడవనాడు (మంగళవారం) నల్ల సముద్ర తీరమున రుమేనియా రేవులను కానుస్టాంజా సులీనాలపై బాంబులువేసితిమనియు, జర్మను ఫిరంగి మోటారు దళమును ద్వంసంచేసితిమనియు, ఆ నాటికి మొత్తం జర్మను విమానాలు 381, రష్యావి 374 విమానాలు నాశనమయినట్లు రష్యా ప్రకటించెను. జర్మనులు తామే ముందంజవేసినట్లును, కొలది దినములలోనే జయించగలమనియు ప్రకటించిరి. హెల్సింకివద్ద తీవ్ర నౌకా యుద్ధం జరిగెను. రష్యను జలాంతర్గామి యొకటి ముంచబడెను. బాల్టికు తీరాన రష్యా రాష్ట్రాల రేవు స్థలములపై జర్మనులు దాడి సలిపిరి. పోలండు యిపుడు రెండవసారి యుద్ధరంగమయినది. వార్సాపై రష్యను విమానాలు తీవ్రమగు దాడి జరిపినవి. లిథువానియా కిదివరకు ముఖ్యపట్నంగానుండిన విల్నా జర్మనులు వశపరచుకొనిరి. రష్యా సరిహద్దువద్దకు హిట్లరు స్వయంగా పోయి సేనలతోనుండి యుద్ధం నడిపించుచున్నాడు. రష్యాకు బాల్టికు సముద్ర తీరాన ప్రధాన రేవు పట్నంగానుండిన లెనిన్‌గ్రాడుపై జర్మనులు బాంబులు వేసిరి, మంటలు ఉపద్రవంగా ఉన్నవి. స్వీడను ముఖ్యపట్నమగు హెల్సింకీపై రషియా విమానాలు దాడి వెడలినవి. రషియా రాజ్యంలో 75 మైళ్ల వరకు చొచ్చుకొని పోతిమనియు రష్యా టాంకులు 180 నాశనమయినవనియు సైన్యాలను రవానాచేయుచున్న 7 రైళ్లను పడగొట్టితిమని జర్మనులు ప్రకటించిరి. త్వరలోనే ఫలితం తేల్చగల మహాపోరాటం జరుగగలదని జర్మను విలేఖరి వ్రాయుచున్నాడు.

ఒక సంవత్సరముక్రింద సోవియటు రష్యాచే నాక్రమింపబడిన లిథువానియా రాష్ట్రము రష్యానుండి విడిపోయి స్వాతంత్ర్యమును ప్రకటించినటుల ఫిన్లండు నుండి వార్తలు వచ్చెను. ఫిన్లండుగూడ రష్యాపై యుద్ధమును 25 వ తేదీన ప్రకటించెను.

ఒంటరిగనే శత్రుల ప్రతిఘటింపవలసి వచ్చునను భావముతోనే తామింతవరకు ఏర్పాటులొనర్చుకొని యుంటిమనియు, అయినను ఇపుడు బ్రిటను, అమెరికా లొనర్చు సహాయమునుగూడ స్వీకరించెదమనియు రష్యను అధికారులు తెలియజేసిరి.

రష్యాపై జర్మనీ యుద్ధము ప్రకటించినదని తెలియగనే 23 వ తేదిన ప్రధానమంత్రి, చక్రవర్తిని కలసికొని కర్తవ్యమును గురించి సంప్రదించెను. పిమ్మట సైనిక నాయకులను పిలచి వారితో మంత్రాంగ మొనర్చెను. 24, 25 వ తేదీలలో మరల జపాను సైనిక నౌకా విమాన సేనానాయకులును మంత్రులును సమావేశమై దీర్ఘముగ చర్చించిరి.

బ్రిటను యొక్క రక్షణ ఏర్పాట్లను చర్చిలు ప్రధాని పరీక్షించుచున్నారు.



చర్చిలు ప్రధానిగారు తమ భార్యతో కూడ బ్రిటను తీరపు రక్షణ ఏర్పాట్లను పరీక్షించుచున్నారు. వీరి వెంట నౌకా శాఖాధికారి ఎ. వి. అలెక్సాండరుగారున్నారు. పరీక్షించుటకుగాను వీరు ఈ పడవలో పోవుచున్నారు.

# రష్యాపై జర్మనీ యుద్ధం

## అకస్మాత్తుగ ఆదివారం సైన్యాలను దాటించుట.

## జర్మనీ నిందలు: రష్యా జవాబు—రష్యాకు బ్రిటను సహాయం.

### యుద్ధ ప్రారంభం.

ఈ నెల 22 వ తేది తెల్లవారుజామున 3-30 గం.టలకు జర్మను సేనలు రష్యా సరిహద్దులు దాటి ఆదేశంపై దాడి ప్రారంభించినవి. జర్మనీ పక్షమగు రుమేనియా సేనలు ప్రూతునది దాటి రష్యాదగు బెసరేబియా ప్రవేశించినవి.

రష్యా-జర్మనీలమధ్య 1,500 మైళ్ల సరిహద్దు గలదు. ఉత్తరమున బాల్టికు సముద్రంనుండి దక్షిణమున నల్లసముద్రంవరకుగల ప్రదేశంలో యింతపొడుగున యిపుడు యుద్ధం సాగుచున్నది.

జర్మనీ సైన్యాలను ముందు యుద్ధానికి పంపి, తరువాత జర్మను నియంతయగు హిట్లరును, అతని ప్రచురణశాఖాధికారియగు గోబెల్సుగారును రేడియోలో అందుకుగల కారణములను ప్రకటించిరి యుద్ధం ప్రారంభించిన పిమ్మటనే బెర్లిను నగరమునందలి రష్యా రాయబారికి జర్మను విదేశాంగమంత్రి వాను రిబెన్ట్రాప్‌గారు రష్యాపై నిందలు మోపుచు ఒక పత్రమును దాఖలుచేసెను. అంతేకాని దాడి ప్రారంభించుటకు, ముందుగా కారణాలు తెల్పుచు అంత్యసందేశం తెలియజేయుట షరతులు కోరుట, అవి అంగీకరింపబడకున్నచో యుద్ధం ప్రకటించుట యిటువంటి సామాన్యతంతు ఏదీ జరుగలేదు.

జర్మనీ రష్యాలకు 1939 వ సం॥ ఆగస్టులో, అంటే 22 నెలల క్రిందట నిరాక్రమణ ఒడంబడిక జరిగెను. అది పదేండ్ల వరకు అమలునందుండునట్లు నిర్ణయించుకొనిరి. అది చాల ముఖ్యమయిన ఒడంబడిక యని అప్పుడు హిట్లరు రిబెంట్రాపులు ప్రకటించియుండిరి. దాని ప్రకారం రష్యా జర్మనీకిగాని, జర్మనీ రష్యాకుగాని స్వయంగాగాని యితర దేశాలతో కలసిగాని ఎట్టి నష్టం కలుగజేయరాదని, ఒండొరులపై దాడి సలుపరాదని అంగీకరించబడెను. నిన్న మొన్నటివరకు ఉభయదేశాలవారు ఒకరిపై నొకరు పల్లెత్తు మాటాడక పరమమిత్రులుగ నుండిరి. అట్టియెడ యింతలో యిట్లు శత్రుత్వం వచ్చుటకు కారణం కనబడదు. రెండు దేశాలవారు సరిహద్దులవద్ద సైన్యాలను సమీకరణచేస్తునారన్నప్పటికీ, చేరువ దేశాలలో యుద్ధం జరుగుచున్నది కాబట్టి కాపుదలకు అట్లా చేస్తున్నారని తలంచబడెను. జర్మనీ దాడి జరిపిన పిమ్మటగాని రష్యా ప్రజలకు యుద్ధం తమ మీదకు వచ్చిందని తెలియనే తెలియదు తనతో మిత్రత్వం కలిగియున్న దేశంపై యీరీతిగ ద్రోహంచేసి యుద్ధం సాగించుటకు హిట్లరు తెలిపిన కారణాలు ఎవ్వరికి నచ్చలేదు. మొందు సఖ్యతచేసుకొని తరువాత ఏమరియుండగా ఆ మిత్ర దేశములపై దాడివెడలి కలించుటయే హిట్లరు యొక్క రాజనీతి యని నేడు మరింత స్పష్టమయింది.

### హిట్లరు రిబెన్ట్రాపుల ప్రకటన.

రష్యాపై యుద్ధం ప్రకటించుచు సైనికులకు హిట్లరు ఒసంగిన సందేశమునందును, రిబెన్ట్రాపు రష్యా రాయబారికి అందజేసిన లేఖయందును వారి యుద్ధానికి తెలిపిన కారణములు కొన్ని యగుపడును. అందు మొద

టిని నిరాక్రమణ ఒడంబడిక గావించుకొన్నప్పటినుండియు సోవియటు (రష్యా) ప్రభుత్వం జర్మనీని కడగొట్టుటకు ద్రోహబుద్ధితో కుట్రలు చేయుచున్నదను ఆరోపణ. ఎస్తోనియా, లిథువానియాలను రష్యా ఆక్రమించి అందు బోల్షివికు సిద్ధాంతములను అమలు జరుపుచున్నది. రష్యాలోని బోల్షివిజమునకు జర్మనీలోని నేషనలు సోషలిజం (నాజీ) సిద్ధాంతములకును బద్ధవైరం. కనుక బోల్షివిజం ఉపద్రవం యూరోపులో నేగాక ప్రపంచంలో యెక్కడ లేకుండా చేసి, నాగరికతను రక్షించడానికే యీ యుద్ధం తలపెట్టితినని హిట్లరు నుడివెను. బాల్టికు రాజ్యాలనాక్రమించి రషియా 40 డివిజనులు (సుమారు 40 వేలు) సైన్యం అచట కేంద్రీకరించుట జర్మనీపై దాడికొరకే. ఫిన్లాండునుకూడ రష్యా అందుకే ఆక్రమించినది. యుగోస్లావియాలో ప్రభుత్వంపై తిరుగుబాటు లేవదీసి, సెర్వియనులను సేనలను సిద్ధంచేసి జర్మనీపై తిరుగబడునట్లుగ రష్యానే ప్రోత్సహించెను. ఆయుధ సహాయంకూడ చేసెను.

అంతేకాక అనుకూల సమయం చూచి జర్మనులపై దాడి సలుపుటకు సరిహద్దులలో 160 డివిజనుల సైన్యం, యంత్ర సామగ్రి, విమానాలను సోవియటు ప్రభుత్వం సిద్ధంచేసింది. ఈ రహస్యాలన్ని యుగోస్లావియాలో రష్యా రాయబారి కార్యాలయమున దొరికినవి. రష్యా తూర్పునుండి యుద్ధంచేస్తుందన్న ధైర్యంతోనే బ్రిటను యింతగా పడునను జర్మనీని నిరోధిస్తున్నది. రష్యా విదేశాంగ మంత్రి మాలటావుగారు 1939 లో బెర్లినుకు వచ్చినపుడు నాల్గు షరతులు కోరెను: (1) రుమేనియాలో బెసరేబియా, బుకోవీనా పరగణాలను రష్యా ఆక్రమించినచో జర్మనీ నిరోధించరాదు, (2) ఫిన్లాండు రష్యాపై ఎదురు తిరిగినపుడు జర్మనీ దానిపై దాడివెడలి రష్యాకు సహాయంచేయవలెను, (3) బల్గేరియా స్వాతంత్ర్యం రక్షణకై రష్యా సేనల నంపినచో జర్మనీ నిరోధింపరాదు, (4) డార్డినల్సు జలసంధి (నల్ల సముద్ర ద్వారం) గుండా రష్యను నావలు యథేచ్ఛగ పోవుటకు, బాస్ఫరసువద్ద రష్యను నావికాశ్రయములను, మెట్ట పటాలములను ఏర్పాటు చేయుటకు అవకాశమివ్వవలెనని మాలటావు కోరినట్లు హిట్లరు ప్రకటించెను. పైవిధంగా రష్యా, ఒడంబడికను ఉల్లంఘించినందున, ఆత్మరక్షణకై జర్మనీ రష్యాపై యుద్ధం ప్రారంభించెననియు, జర్మను సైనికుల చేతిలో జర్మను రాజ్యంయొక్క భవిష్యత్తు భాగ్యం అంతా ఉన్నదనియు, వారు ధైర్యంగా పోరాడవలెననియు హెచ్చరించెను. ఇంగ్లాండులోని రాజకీయ సైనిక నాయకులకును రష్యాకును ఇంకా సన్నిహిత సహకారము ఏర్పాటు చేయుటనుగురించి బ్రిటిషు రాయబారి సర్ స్టాఫర్డు క్రిప్సుగారు ప్రయత్నించిరని వేరొక కారణమును రిబెను ట్రాఫ్‌గారు తెలిపిరి.

### మాలటావుగారి జవాబు.

పై విషయములు ఏమీ నిజంకావని రష్యా మంత్రి మాలటావుగారు తెలిపిన ప్రత్యుత్తరంవలన స్పష్టపడును. ఒకటి మాత్రం నిజం బాల్కను రాష్ట్రాలను రష్యా కోరెననియు, జర్మనీ అందుకంగీకరింపక తానే వాటిని ఆక్రమించుకొనెననియు స్పష్టమయినది. ఈ యుద్ధానికి మూలకారణం అది. ఒడంబడిక షరతులను రష్యా ఆవంతయు సందేహమునకు అవకాశంలేకుండా అమలు జరుపుచున్నదని మాలటావుగారు తెలిపిరి. "ఒడంబడిక భంగపరిచినట్లు జర్మనీ రుజువు చేయుటకు ఒక్క నిదర్శనమైన చూపలేదు. మా సైన్య సమీకరణగూర్చి అదివరకు ఒక్కసారికూడ జర్మనీ నిరసనం తెలిపియుండలేదు. మా విమానాలు ఎన్నడు సరిహద్దు దాటలేదు హిట్లరు ప్రకటనంతా అబద్ధాలపుంజం. ఈ యుద్ధం మేము కోరిందికాదు. రష్యను ప్రజలు కార్మికులు కోరిందికాదు. ఫ్రాంసు, జెక్కో, నార్వే, డచ్చి మున్నగు దేశీయులందరిని అణచివేసిన జర్మను ఫాసిస్టు నాయకుల రక్తపిపాసయే యీ యుద్ధానికి కారణం. కావున శత్రువులను తరిమివేసి, ఒక అంగుళమైనా వారివశంకాకుండా కాపాడవలెనని రష్యా సైనికులకు ఆజ్ఞాపించితిమి. ఆదివరకు నెపోలియను చక్రవర్తి మాదేశంపై దాడివచ్చినపుడు ఎటుల ఓడింపబడెనో యిపుడును జర్మను సేనలను, రష్యా సైనికులు ప్రజలందరును ఐకమత్యంతో ఎదిరించి, ఎంత త్యాగమయినా చేసి ఓడించగలరు." అని మాలటావుగారనిరి.

### అసలు నిజమయిన కారణం.

రష్యాపై యుద్ధంచేయడానికి జర్మనీ నియంత చెప్పిన కారణాలు కారణాలే కావు. అసలు నాజీ నాయకుల ఆలోచన వేరు. ప్రపంచాధిపత్యం వహించవలెనని ఆశగల హిట్లరు ఎత్తులు యూరోపులో చిన్న రాజ్యాలను, ఫ్రాంసును పడగొట్టుటకు పనికివచ్చెను. కాని బ్రిటిషు శక్తిని కదలింపజాలకపోయెను. బ్రిటిషు సామ్రాజ్య సైన్యములు ఇరాకులోను, సిరియాలోను జర్మనీ యెత్తులను నిరోధించెను. ఈజిప్టు, సూయజు కాల్వలపై అక్షరాజ్యాలు తలపెట్టిన దాడి సంవత్సరంపైగా జరుగుచున్నను, లిబియా సరిహద్దుదాటి రాజాలకపోయెను. బ్రిటనుపై దాడిచేసి మహాసంగ్రామము ముగించుట హిట్లరుకు అసాధ్యమయ్యెను. బ్రిటను యుద్ధానంతరమైనను రష్యాతో జర్మనీకి యుద్ధం తప్పదు. ఈ రెండు దేశాల శత్రుత్వం చరిత్రాత్మకమైనది. ఇంగ్లండుపై దాడికి అవసరమై తాత్కాలికంగా రష్యాతో హిట్లరు బూటకం ఒడంబడిక చేసుకొనెనేగాని, ఎప్పటికైనా రష్యాను అణచివేయాలను సంకల్పం అతనికి పోలేదు. బ్రిటను యుద్ధం ముగినేవరకు వేచియుండుటకంటె, ఇపుడే రష్యా పూర్తిగ విమరయుండునపుడే, దానిపై దాడివెడలుట ఉచితమని తలంచెను. సోవియటు రష్యాను చితుకకొట్టుట యిపుడే సులభమనితలంచి, ఎప్పటికీ జర్మనీపైకి అది తిరుగబడకుండ చేయుటే వారి యుద్దేశంకాని, ప్రస్తుతమునకు కొన్ని సౌకర్యములు రష్యానుండి బడయుట కాదు. అందుకే అధికార రీత్యా రిబెన్‌ట్రాఫ్ రష్యాకు దాఖలుచేసిన యుద్ధ ప్రకటన పత్రమునందుగూడ ఎట్టి షరతులు సూచించియుండలేదు.

ఇంకో కారణమేమంటే ఇంగ్లాండునకు అమెరికా ఆయుధ సహాయం చేస్తున్నది కావున యీ యుద్ధం చాలకాలం జరిగేటట్లుంది. కాలం జరిగినకొలది ఆయుధ సప్లై ఆహార పదార్థాలు, చమురు సప్లైలు తగ్గి, అవి యెక్కువగాగల రష్యాపై జర్మనీ ఆధారపడవలసివచ్చును. తాము చెప్పినట్లు నడచుకున్న నేగాని రష్యనులు జర్మనీకి సప్లైలు చేయకపోవచ్చును. అందుచే ఇంగ్లాండుమాట వెనుకపెట్టి, ముందుగా రష్యాను అణచివేసినచో యుక్రెయినులోనున్న గోధుమపంట, ఆహారపదార్థాలు, రష్యా విమాన నిర్మాణశాలలు, ఇతర ఫ్యాక్టరీలు, నౌకా నిర్మాణశాలలు, సాలునకు 30 లక్షల టన్నుల ఉత్పత్తిచేయు చమురు గనులు జర్మనులు వశపరచుకోవచ్చు. వాటితో ప్రపంచాన్నంతా ఎంతకాలమైనా జర్మనీ నిరోధించవచ్చును. అపుడు ఇంగ్లాండు తనంత తానే యుద్ధం విరమించుకొని, సంధికి రాగలదని జర్మను నాయకులు తలంచియుండవచ్చును. కావున రష్యా - జర్మనీ యుద్ధమునకు రాజకీయ సైనిక ప్రయోజనములే కారణముగాని, మూల సిద్ధాంతవైరుధ్యం కానేకాదు.

### చర్చిలు ప్రకటన.

బ్రిటిషు ప్రధాని చర్చిలుగారు, రష్యాకు బ్రిటను అన్ని విధముల సహాయం చేస్తుందని తెల్పుచు రేడియోద్వారా

గంభీరోపన్యాసం చేసిరి. "యుద్ధంలో యిపుడు నాల్గవ ఘట్టం చేరితిమి. నార్వే, డెన్మార్కు, హాలెండు, బెల్జియములకు చేసిన వాగ్దానములను జర్మనీ వెనుక భంగపరచెను. హిట్లరుకు తోడుదొంగయగు ముసోలినీ గ్రీసును ఆవిధంగానే నమ్మించి గొంతుకోసెను. ఇపుడు జర్మనీ రష్యాను మోసగించెను. ఇట్లు జరుగునని నేను ముందే స్టాలినుకి హెచ్చరించియుంటిని. మానవరక్తము ఏరులుగా పారించవలెనను ఆశ హిట్లరుకి ఎక్కువ. యూరోపు దేశమును లొంగదీసుకున్నప్పటికి తనివితీరక, రష్యా ఆశియాలమీద విజృంభించి అచ్చటి జనసమూహమును నాశనమొనరింపదలచెను. రష్యాలో ధాన్యమును, పెట్రోలును జర్మనీ తాను తీసుకొని దుర్భరక్షామమును తెచ్చిపెట్టగలదు. తరువాత చీనా ఇండియాలలోగల మొత్తం నూరు కోట్ల ప్రజలకు జర్మనీవల్ల ముప్పురానున్నదని నిస్సంశయంగా చెప్పవచ్చును.

హిట్లరుయొక్క నాజీ తత్వమును సమూలంగా నాశనం చేయడమే బ్రిటిషువారి ఏకైక ఆశయము. భూమికి భారమగు జర్మను నాజీలబలము అడుగంటువరకు, జర్మనీలో బంధించుకొన్న దేశములకు విముక్తి లభించువరకు బ్రిటిషు విమానాలు అచంచలంగా పోరగలవు. హిట్లరుతోను అతని ముఠాతోను ఎపుడును సంధిరాయబారాలు జరుపము. జర్మనీనాజీ తత్వం మీద కత్తిదూసిన వారందరికి బ్రిటను సహాయం చేస్తుంది. హిట్లరు మిత్రులు మాకు శత్రువులు. హిట్లరు శత్రువులు మాకు మిత్రులు. రష్యాకు రషియను ప్రజలకు మేము సహాయంచేయుచు, సహాయం చేయవలసిందని ప్రపంచంలోగల మిత్రదేశాలన్నింటికి ప్రబోధింతుము. యుద్ధ సామగ్రిని, వాటిని వాడుటలో అనుభవంగల నిపుణులను సలహాయిచ్చు నిమిత్తం రష్యాకు పంపుదుమని ఆ ప్రభుత్వమునకు తెలియజేసితిమి.

రష్యా-జర్మనీ యుద్ధం ధనాధికులు బీదలతోగాని, ఒక రాజకీయ సిద్ధాంతం నమ్ముపార్టీ యింకో పార్టీవారితోగాని, చేయుచున్న యుద్ధంకాదు. సామ్రాజ్యంలో అన్ని పార్టీలవారు తమ విభేదములు మరచి యుద్ధంలో పాల్గొనుచున్నారు. రష్యా కమ్యూనిష్టు రాజ్యం కనుక దానిపై జర్మనీ దండెత్తిన మాకేమని అమెరికా - బ్రిటను ఊరుకోవు. యూరోపులోని చిన్నచిన్న రాజ్యాలన్నియు మొట్టమొదటనే ఏకమై జర్మనీని నిరోధించియుండినచో పరిస్థితులింతవరకు వచ్చేవికావు.

చలికాలం ప్రారంభంలోగా రష్యాను లోబరచుకొని అమెరికానుండి సహాయం బ్రిటనుకుచేరకముందే, యీ సంవత్సరంలోనే, బ్రిటన్ను కూడ కొట్టవలెనని జర్మనీ ఎత్తువేసింది. కావున రష్యాకు యిపుడు సంభవించిన కష్టం బ్రిటను అమెరికాలకు సంభవించినట్లే. రష్యాకు సహాయంచేయుట యావత్ప్రపంచంయొక్క ధర్మమై యున్నది" అని చర్చిలుగారనిరి.

## రష్యా సైనిక బలం.

ఫిన్లండు నాక్రమించినపుడు కొంచెం కష్టపడి ఆలశ్యమగుటనందున రష్యా సైనిక విమానశక్తినిగూర్చి అనేకులకు అనేక సందేహములుండెను. కాని ఫిన్లండు యుద్ధంవలన తెలిసిన లోపాలు సవరించి, స్టాలిను (రష్యను నియంత) సైనికాధికారులలోగూడ కొన్ని మార్పులుచేసి, మూడు రకాల సైన్యాలను సర్వసిద్ధంగానుంచెను. రష్యా విమానదళం ఎంతయుందో యితర ప్రపంచానికి తెలియకుండా రహస్యంగా ఉంచబడెను. యుద్ధరంగంలో ముందు వరుసకు నాలుగైదు వేల విమానాలను పంపినచో అంతసంఖ్య వెనుక రిజర్వులో ఉంచగలదు. రష్యనులకు వైమానిక శిక్షణం ఉగ్గుపాలతో నేర్పినవిద్య. ప్రపంచం లోకెల్ల మున్ముందు గాలి గుమ్మటాలలో (పారాషూటు) దిగడం రష్యనులే అభ్యసించిరి. ఇతరులు వారివద్దనే నేర్చుకొనిరి. మొగ ఆడభేదంలేకుండా రష్యనులందరు విమానాలలో ఎగరడం నేర్చినవారే. ఇపుడు రష్యాలో అనేక క్రొత్తరకం విమానాలుకట్టి, వాటిని గూర్చిన వివరాలు రహస్యంగా ఉంచిరి. విమాన నిర్మాణశాలలందు ఎన్నో లక్షలమంది పనిచేయుచుందురు. 24 సం॥లనుండి రష్యా దేశరక్షణ కార్యములందే ప్రజలను పనివారిని సైనికులను తరిఫీదుచేయుచున్నది. రష్యా విమానదళం జర్మనీ దళంకన్న ఎక్కువో సరిసమానంగానో యుండును. అయితే జర్మనీ విమానాలు అన్ని దేశాలలో చెదరిఉండగా, యీ యుద్ధంలో రష్యా విమానాలు ఒక్క జర్మనీదాడినే ఎదుర్కోవలసియుండును. అందుచే రష్యా విమానశక్తియే ఎక్కువనిచెప్పవచ్చు.

రష్యా నౌకాదళంలో సబుమెరైనులు అత్యంత క్రొత్త పద్ధతులలో కట్టినవి. చాల సమృద్ధిగా ఉన్నాయి. వాటిని రష్యనులు అతిసులభంగా నేలపైనుండే ఒక చోటినుండి యింకోచోటికి మార్చగలరు. అందుచే హిట్లరు బాల్టికు సముద్రంనుండి నల్లసముద్రమునుండి కదలకుండా బంధించినా ఫరవాలేదు. మంచుతో గడ్డకట్టిన ఆర్కిటికు సముద్రంపై సైన్యాలు నడిపించి యుద్ధం చేయుటయందు రషియనులు ఆరితేరియున్నారు. 1917 నుండి ప్రతి యువకునకు నిర్బంధంగా సైనిక శిక్షణ యొసంగబడుచున్నది. రష్యా వైశాల్యమునకు జనసంఖ్యకు పేర్వడినది. కనుక సైన్యానికి కొదవయుండదు.

ఫిన్లాండు యుద్ధంలో మాగినాటు లైనువంటి మానరుహీము సైనికశిబిర శ్రేణిని రష్యాసేనలు భేదించగల్గినవి. రష్యాసేనకు అన్ని రకముల ఆధునిక మారణ యంత్ర సామగ్రిగలదు. వాటి నుపయోగించు నిపుణులు తగినంత మందిగలరు.

## యుద్ధ క్రమం.

ఆదివారం తెల్లవారుజామునయుద్ధం ప్రారంభకాగానేరుమేనియా సైన్యాలు బెసరేబియా సరిహద్దులవరకువచ్చి బుకవీనా రాష్ట్రంలోని బాల్టేడుపురం వశపరచుకొన్నవి. మూడు రష్యను విమానాలు పడగొట్టబడినవి. రష్యా సేనలు తీవ్ర నిరోధం కల్గించినవి. జిటోమిరు, కియావ్, సిబాస్టపూలు, కేనాను గ్రామములను జర్మను లాక్రమించిరి. 200 మంది రష్యనులు గాగాయపడుటో చచ్చుటో జరిగెను.

ఆనాడే తూర్పు ప్రష్యా (జర్మనీలో నొక రాష్ట్రం) నుండి జర్మను సేనలు రష్యాలోనికి చొచ్చుకొనివచ్చి అకస్మాత్తుగ మరఫిరంగులు పేల్చి భీభత్సం చేసినవి. రష్యాదగు పోలండు భాగంలో బగు నదికి పడమర 60 మైళ్లవరకు రష్యనులు ప్రజలను ఖాళీచేయించి, వంతెనలు పడగొట్టి శత్రువుల దాడికి అలవికాకుండ చేసిరి. ఇచట గ్రాగ్నో క్రిష్ట నపోలులందు జర్మనులు ప్రవేశించిరి. సరిహద్దుకి పది మైళ్లలోపునయున్న మరి మూడు గ్రామాలను వశపరచుకొనిరి. జర్మను విమానాలు 75 కూల్చబడినవని రష్యా ప్రకటించెను. నల్ల సముద్రంలో ఉభయులు మందుగనులు నాటిరి. ఒడెస్సాపై జర్మనులు బాంబులు వేసిరి. జర్మనీదగు పోలండుపైకి రష్యా బాంబు విమానాలు 35 రాగా, 33 కూల్చితిమని జర్మనీ ప్రకటించెను. ప్రష్యాపై వచ్చిన 9 విమానాలలో 7 కూల్చితిమనిరి.

రెండవనాడు యుద్ధంలో జర్మనుల విమానాలు 50 పడగొట్టితిమనియు, 5,000 మంది జర్మనులు ఖైదీలుగా పట్టుపడిరనియు, లితువానియా రంగమున జర్మనులు 300 టాంకులు నష్టపోయిరనియు రష్యా ప్రభుత్వం ప్రకటించెను.

రష్యావారి పోలండులోని బెస్టులిటోవాస్కు పురమును మరి రెండు గ్రామములను జర్మను లాక్రమించిరి. యుద్ధం 1,500 మైళ్ల పొడుగు సరిహద్దున జరుగుచునేయున్నవి. రష్యా సేనలు తిరుగు దాడులు ప్రారంభించి జయించుచున్నవి.

రుమేనియా సైన్యములు రష్యావారిదగు బెసరేబియా లో 62 మైళ్లు ముందుకు చొచ్చుకొని పోయినవనియు, బాల్టిక్ సముద్రమునందు రష్యావారి నౌకలు 5 మొత్తం 6,000 టన్నుల బరువుగలవి ముంచబడినవనియు జర్మనులు ప్రకటించిరి. రష్యను సేనలు పోలండుపైకి, రుమేనియా, ప్రష్యాలమీదకు దాడి సాగించుచున్నవి. రోజు రోజుకి యుద్ధం తీవ్రతరమగుచున్నది.

# సిరియాలో జర్మనులను తరిమి స్వాతంత్ర్య మొసంగుట.

## బ్రిటిషువారి సంకల్పం—నేటి స్థితి.

సిరియా విషయమున గట్టి చర్య గైకొనుటకు ఇంగ్లాండు ఎంతో ఆలోచించెను. సిరియాలో జర్మనులు యెక్కువగా చేరసాగిరి. ఇంక ఇరాకుపై దాడివచ్చుటకు సిరియా నొక మెట్టుగ ఉపయోగించదలచిరని రూఢియైనది. ఇంగ్లాండు మధ్య ప్రాచ్య దేశములను రక్షింపదలచినది గావున వాటిపై దాడిచేయుటకనువుగ సిరియా, లిబినాను రాజ్యములను శత్రువు లెవ్వరు వశపరచుకొనుటను సహింపనని ఇంగ్లాండు గత జూలై మాసమునందే ప్రకటించెను. కాని సిరియాలోనికి సైన్యాలు పంపినచో విషీ ప్రభుత్వంతో యుద్ధం వచ్చినట్లే. ఇంగ్లాండు-విషీ ప్రభుత్వాలకు యుద్ధం రావలనే జర్మనీ కోరుచున్నది. అపుడైతే ఫ్రెంచి సామ్రాజ్యాన్ని అక్షరాజ్యాల చేతిలో నుంచుకోవచ్చునని ఊహ. కాని క్రీటు దీవిలో బ్రిటిషు సేనలు జర్మనీ యత్నములను తీవ్రముగ నిరోధించుటచే, వెంటనే సిరియాలోనికి జర్మనులు రాజాలక పోయిరి. అందుచే స్వతంత్ర ఫ్రెంచి సైన్యాలకు తోడ్పడి సిరియానుండి జర్మనులను తరిమివేసి, సిరియాకు స్వాతంత్ర్యం హామీచేయుటకు బ్రిటను తొందరపడెను. సిరియాలోనున్న విషీ సేనలను తమవైపు త్రిప్పుకొనుటకు స్వతంత్ర ఫ్రెంచి సేనలు మిత్రమండలి సేనలు పాటుబడుచున్నవి. ఎక్కువగ ప్రోత్సాహము చేయుచున్నారు. కాని డెంట్జు (విషీ ప్రభుత్వ) సేనాని వినక తిరుగుబాటు చేయుచున్నాడు. సిరియా యుద్ధమునకు ఒరాను యుద్ధమునకు అట్టే వ్యత్యాసంలేదు ఒరానులో నౌకాదళం శత్రు వశంకాకుండుటకై బ్రిటిషువారు యుద్ధం చేసిరిగాని, ఫ్రాంసుతో శత్రుత్వా సాధించు సంగ్రామమునకు దిగుటలేదు. ఇపుడు సిరియాలోగూడ అంతే. పరిస్థితులు క్లిష్టంగా వున్నాయి. కష్టసాధ్యమగు కార్యమునే తల పెట్టిరి. కాని స్వతంత్ర ఫ్రాంసు నాయకుడగు డిగాలు సేనాని సిరియాకు స్వాతంత్ర్యం వాగ్దానంచేసెను. సిరియను ప్రజలెటు తిరిగెదరో? బ్రిటను, ఫ్రాంసు, జర్మనీలలో బ్రిటనే తమదేశం ఆక్రమిస్తే తమకు స్వాతంత్ర్యం తప్పక లభింపగలదని సిరియా ప్రజలు బాగా యెరుంగుదురు. ఆ వాగ్దానం చెల్లించాలంటే, స్వతంత్ర ఫ్రెంచి సేనలు బ్రిటిషు సేనలు అతివడిగా ఆ దేశాన్ని యిపుడాక్రమించి, జర్మనీ సేన రాకుండానే గట్టిరక్షణ శిబిరాలను యేర్పాటుచేయుటకు అవకాశమివ్వవలెను. ఇంతవరకు పని సంతృప్తికరంగానే జరుగుచున్నది. సిరియా ముఖ్యపట్నమగు డామస్కసు గూడ బ్రిటిషువారి వశమైంది.

జర్మనుల గతియేమి? తమ విమానాలను, మారు వేషాలతో నున్న నిపుణ సైనికులను సిరియానుండి తొలగించిరి. సిరియాలో విమానాశ్రయాలను ఇంగ్లాండు ఆక్రమించుటకు విడచిరి. నిరుడు ఫ్రాంసు పడిపోయినపుడు యిట్లు జరుగలేదు. బల్గేరియాలోవలె మారు వేషాలతో యిచట జర్మనులు దిగలేకపోయిరి. ఎదిరించుకొనుటకు జర్మనులు తగినంత శక్తి సంపాదించి సంఖ్య పెంచకముందే మిత్రమండలివారు చేరి వారిని తరిమివేసిరి. ఇపుడు రష్యాతో యుద్ధానికి దిగి చేతినిండా పని యున్నందున, రోడ్సు దీవినుండి సిరియాపైగాని, సోలంనుండి ఈజిప్టుపైగాని దాడివచ్చుటకైనా, విమానాలపైనుండి సైన్యాలను పంపి అలగ్జాండ్రియా సూయజు కాల్వలపై బాంబులు వేయడానికైనా జర్మనీకి వీలుండదనుకోవచ్చు. రష్యాను ఓడింపగలిగితే కాకసను, ఇరాను దేశములమీదుగ మధ్య ప్రాచ్యదేశముల వెనుకవైపునుండి దాడి సాగింపదలచిరేమో, కాని అదంత సులభమైన పనిగా తోచదు.

# ఇరాకులో ఇంగ్లాండు కట్టుదిట్టాలు.

## రషీదాలిద్వారా జర్మను కుట్రలు విఫలమైనవి.

ఇరాకులో యుద్ధం నిలచిపోయినా శత్రువుల ప్రచారం తగ్గలేదు. రీజెంటు అమీరు అబ్దుల్ ఇల్లాగారు తిరిగి బాగ్దాదు చేరుకొని జాతీయ ప్రభుత్వమును స్థాపించెను. ప్రజామోదము బడసిన దేశీయునే మంత్రిగ నియమించి, శాంతి నెలకొల్పెను. ప్రభుత్వ పరిపాలనా శాఖలు దేశమంతా యథాప్రకారం పనిచేయుచున్నవి. రైలు, పోస్టు టెలిగ్రాఫ్ సదుపాయములన్ని తిరిగి యేర్పడినవి. ముఖ్య పట్నమునందు తిరుగుబాటును ఇరాక ప్రభుత్వం గట్టి చర్యగైకొని అణచివేసెను. గత నెలాఖరున బాస్రా చుట్టుపట్ల అరాచకము ప్రబలెను. కాని యిపుడంతా శాంతించెను. బ్రిటిషువారు పట్టుదలతో పనిచేయుటయు, అరబ్బుల ఆశయముల నంగీకరించుచు, వారియెడ సానుభూతి దెల్పుచు, వారి స్వాతంత్ర్యమును అరికట్టమని ఈడెను (బ్రిటిషు విదేశాంగ మంత్రి) నమ్మబలుకుటయు, యీ మార్పునకు కారణములు. ఇంగ్లాండు ఇరాకును ఆక్రమిస్తున్నదని జర్మనులు ప్రకటించిన వార్త అసత్యమని రుజువు చేయబడినది. రషీదాలికి తిరుగుబాటు చేయుమని జర్మనీ లంచమిచ్చినట్లు అందరికి తెలిసినది. కాని రషీదాలికి ప్రాణాపాయ సమయమునందు జర్మనీ సహాయంచేయు నిరాకరించుటచేత, జర్మనీని నమ్మరాదని అందరికీ స్పష్టంగా తెలిసింది. ఇరాకులో తగవుపెట్టి తన యితర దేశాలాక్రమణ కార్యానికి వీలుకలుగ జేసుకోవడమే జర్మనీయొక్క ఉద్దేశము. సిరయావలెనే ఇరాకు గూడ జర్మనీ మాయలో పడుచుండెను. ఇరాకునకు స్వాతంత్ర్యమిచ్చి, అదివరకిచ్చిన వాగ్దానాలన్ని చెల్లించి పరిపాలనా సౌష్టవమును బ్రిటను చేకూర్చుచుండగా, తన స్వాధీనమునందున్న సిరియాకు ఫ్రాంసు అట్లు చేయజాలకుండెను. ఇరాకులో బ్రిటిషువారు సైనిక చర్యలు విధిలేక గైకొనవలసి వచ్చెను. కోపంతో కాక దుఃఖంతో ఆ పనులన్ని చేసిరి. ఇరాకులో పరిస్థితులను చక్కబెట్టుటకు బ్రిటిషువారు పడుచున్న యీ శ్రమకును, అలగ్జాండ్రియా, హైఫా మున్నగు నగరాలపై బాంబులు వేయుచున్న జర్మనుల చర్యకును పోటిగలదా?

# మదరాసు విమానదళము

## బ్రిటను రక్షణయందు తోడ్పడిన విధము

## ప్రశంసార్హముగ పనిచేసి అనేక బిరుదులు సంపాదించింది.

మదరాసు గవర్నరుగారి యుద్ధనిధి కోటి రూపాయల కన్న ఎక్కువ వసూలయినదని పాఠకులకు తెలుసు. ఈ నిధి బ్రిటను మంత్రిగారికి విమానాలకొని మదరాసులో ఆయా జిల్లాల పేర్లు పెట్టుమని కోరియుండిరి. ఆ ప్రకారం వారు యుద్ధ విమానాలు కొని కొన్ని స్క్వాడ్రనులను (విమాన దళములను) ఏర్పాటుచేసిరి. వాటిలో అగ్నికుండములు (స్పిటుఫైర్సు) తుపానులు (హరికేనులు) రెండు రకములు గలవు.

1940 లో మదరాసు అగ్నికుండములు ఇంగ్లాండు పడమటితీరమున కొన్ని మాసములుండి ప్రయాణముచేయుచున్న నౌకలను రక్షించుచుండెడివి. ఆ ఏడు సెప్టెంబరులో అవి లండను రక్షణకై ఇంగ్లాండు ఆగ్నేయ దిక్కునకు రప్పించబడినవి అపుడు నాల్గు రోజులలో దాడివచ్చిన శత్రువిమానాలు పదమూడింటిని పడగొట్టినవి. తరువాత నవంబరులో జవలిన్ అను బ్రిటిషు యుద్ధ నౌకను జర్మను విమానాలు వెంటాడి బాంబులువేసి కొట్టుచుండగ, వాటి రక్షణకు మదరాసు విమానాలుపోయి, దానిని రేవుచేర్చినవి. తెరతెరలుగ వచ్చుచుండిన జర్మను బాంబరు విమానాలను బెదిరించి మూడింటిని పడగొట్టి, ఒకదాని చెడగొట్టినవి. ఈ యుద్ధం కొన్ని గంటలు జరిగింది. సెప్టెంబరు 15 వ తేదిన దక్షిణతీరాన ఒకేనాడు అత్యధికసంఖ్య 185 శత్రు విమానాలు పడగొట్టబడినపుడు, అందు నాల్గు మదరాసు విమానాల వంతైనవి. ఈ విమానాలలోనున్న వైమానిక సైనికులందు ఒకసార్జెంటు ఒక్కడూ 6 శత్రువిమానాలను, వేరొక వైమానికుడు 14 పడగొట్టిరి.

### తుపాను విమానాలు.

1939 వ సం॥ అక్టోబరులో ఒక జర్మను విమానం గుండ్రంగా సర్కిల్సు తిరుగుచు పొగవదలుచు సముద్రంలో పడడం కెంటుతీరాన్న ఒకడు చూచెను. తరువాత అది మునిగినచోటికి మూడు తుపాను విమానాలువచ్చి చుట్టిచుట్టి పోయినవి. డోవరు రేవులో ముంచబడిన ఆ మొదటి శత్రు విమానాన్ని ముంచిన ఆ తుపాను విమానాలు మదరాసు దళానికి చెందినవి. అటు తరువాత ఆ వైమానికులు ఫ్రాంసుపై ఎగిరి మొత్తం 65 శత్రువిమానాలను పడగొట్టిరి హిట్లరు డచిదేశమును ఆక్రమించునపుడు వీరు ఫ్రాంసులోనుండి పది రోజులలో 25, మరలివచ్చు ఆఖరురోజున మరో 10 జర్మను విమానాలను కూల్చిరి. తరువాత ఇంగ్లాండు రేవుల రక్షణకువచ్చి అచట 11 విమానాలను కూల్చిరి. మదరాసు హరికేనుల ఘనకార్యము లివర్పూలు రేవును పగటి దాడిలో రక్షించుట. ఇటీవల వీరు రాత్రులందువచ్చు జర్మను విమానాలను ఎదుర్కొనుచు కొన్నింటిని కూల్చిరి. వీరిలో ఒక కనడా వైమానికుడు, ఆరు శత్రువిమానాలు తనను చుట్టివేయగ ఒకటికూల్చి, యింకొదాని కుంటిపరచి, తప్పించుకొనెను. ఈతనికి తక్కినవారికి తగిన బిరుదము లొసంగబడెను. వీరిలో ఒకడు 8 గంటలసేపు విమాన యుద్ధంచేసి ఒక్కడూ 5 శత్రు విమానాలను కూల్చెను.

# డామస్కసు ముట్టడిలో భారతీయ సైనికుల ప్రతిభ

భారతీయ సైనికులు రెండు బటాలియనులు (సుమారు 1,400 మంది) అత్యద్భుతముగ పోరాడి సిరియా ముఖ్య పట్నమగు డామస్కసు నాక్రమించుటలో స్వతంత్ర ఫ్రెంచి సేనలకు తోడ్పడినవి. ఆదివరకు యీ సేనయే కిస్వే ఆక్రమించుటలో బ్రిటిషు సేనకు తోడ్పడెను. ఈ నెల 19 వ తేది ఉషఃకాలమున ఫ్రీం డామస్కసు నగర ద్వారమువలెనున్న మెజ్జి గ్రామమును ముట్టడిచేసి, అలసియున్నను అతిశక్తివంతంగా రాత్రంతా పోరి విజయంగాంచిన విషయం లెఫ్టునెంటు కర్నలు డెస్మండు యంగుగారు వ్రాసి పంపిరి. వీరు అచట సైన్యాలతో అధికారుల తరఫు ప్రేక్షకుడుగ ఉన్నారు. ఆతడిటులు తెలిపెను :—

డామస్కసు గుర్రపు డెక్కవలెనుండు కొండలమధ్య నున్నది. దానికి కునేత్రనుండి పోవు రోడ్డునకు కుడివైపున మూదామియా, మెజ్జి అను రెండు గ్రామాలు ఆరు మైళ్లు ఎడంగా గలవు. ఈ రెంటి మధ్య విమానాశ్రయం ఒకటి గలదు. మెజి డామస్కసు నగరానికి ద్వారంపలె ఉంది. అదివరకే అలసియున్న భారతీయ సేన ఆ విమానాశ్రయమును వశపరచుకొని, మెజ్జి వెనుకకు కొంత సేనపోయి అచటి కోటలను వశపరచుకోవలసియుంది. అంతా 12 మైళ్లు కాలినడకనపోయి రాత్రే యుద్ధంచేసి జయించవలసి ఉండెను. రాత్రి 11 గంటలకు మూదామియా గ్రామం ప్రవేశించు సరికి పావుగంటలో మరఫిరంగులు ప్రేలి తరువాత నిశ్శబ్దమయింది. దాని వశపరచుకొని విమానాశ్రయం చేరు సరికి శత్రువులు తిరిగి ఫిరంగులు ప్రేల్చిరి. కొంత సేపటికి నిశ్శబ్దమయ్యెను. తరువాత మెజ్జి చేరుసరికి మరల ఫిరంగి మోత వినబడెను. తెల్లవారువరకు యుద్ధం సాగుతునే ఉంది. వారి వెంటనే వచ్చిన మేము చాలా అలసి ఒక కొండపైనుండి చూచుచుంటిమి. తెల్లవారేక నేను మవుదామియకు పోయి, తరువాత విమానాశ్రయం చూచి, మెజ్జి గ్రామంవరకు పోవుచుండగ, శత్రువులు ఫిరంగులు ప్రేల్చిరి. తప్పించుకొని ఒక కాల్వలో దాగొనగా, ఒక టాంకు వచ్చి నన్ను ఖైదు చేసెను. దానిలోనే నేను డామస్కసు ప్రవేశించితిని. రాత్రి ప్రారంభమయిన యుద్ధం మరునాడు మధ్యాహ్నంవరకు కొనసాగెను. పగవగానే ఒక ఖాళీ యిల్లు ప్రవేశించి తమ కేంద్రస్థానంగా భారతీయు లొనర్చుకొన్నారు. ఇంటింటు మారి శత్రువులతో ముష్టి యుద్ధం జరుపుచుండిరి. శత్రువుల టాంకులనేకం వచ్చేయి. కాని భారతీయులకు వస్తున్న అదనపు ఆయుధ సహాయమును మూదామియా గ్రామంనుండే శత్రువుల మరఫిరంగులు వెనుకకు తరిమివేశేయి. వారి కేంద్రభవనంనిండా గాయపడినవారే. అందుచే గత్యంతరం లేక లొంగిపోవలసివచ్చెను. కాని మరింత ఎక్కువకాలం నిరోధించి శత్రువులను ఎదిరించి నిలచియుండుటచే, కుడివైపున కిస్వేనుండి వచ్చుచున్న స్వతంత్ర ఫ్రెంచి సేనలకు నిరోధంలేకుండా డామస్కసు ప్రవేశింప వీలయ్యెను. వారు వచ్చి పురమాక్రమించి ఖైదీలను విడిపించిరి. భారతీయ సైన్యం చాల చొరవతో, ప్రక్క కొండలనుండి ఫిరంగులను లక్ష్యం చేయక చొచ్చుకొనిపోవుటవల్లను, దినమంతా నిలువరించగల్గుటచేతనే డామస్కసు నగరం పట్టుబడింది.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డెరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.